''ప్రాజ్ఞ్గి ప్రాజ్ఞ ప్రలాపజ్ఞః
ప్రలాపజ్ఞ మిదం వచః
ప్రాజ్ఞః ప్రాజ్ఞం ప్రలాపజ్ఞః
ప్రలాపజ్ఞతం వచోఽబ్రవీత్''

వారణావతము నందలి లక్క యింటికి పోవునపుడు విదురుడు ధర్మ రాజుతో చెప్పిన శ్లోకములు.

అలోహం నిశితం శస్త్రం
శరీర పరి కర్తనం
యో వేత్తి నతుతం ఘ్నన్తి
ప్రతిఘాత విదం ద్విషః",
"గృహా దగ్నిశ్చ బోద్ధవ్య
ఇతి మాం విదుర్యోఽబ్రవీత్
పన్థాశ్చ వా విదితః
కశ్చితే స్యాదితి ధర్మ ధీః."

వీనిలో కూడ విదురుడు అగ్నిభయమును సూచించి ధర్మరాజును మెలకువతో నుండుమని హెచ్చరించెను కుంతి విదురుడేమి చెప్పెనని అడుగగా ధర్మరాజు విదురుడు చెప్పిన ఉపదేశమును తెలియపరిచెను.

లాక్షణికుల కావ్య ప్రయోజనములను తెలుపుచు కావ్యము కీర్తినిచ్చును, అర్థమునిచ్చును, వ్యవహార వేత్తృత్వమును కల్గించును, అమంగళమును పరి హరించును. అప్పటికప్పుడు పరనివృత్తిని చేకూర్చును. కాంతాసమ్మితత్వముచే ఉపదేశము నొసంగును అని చెప్పిరి. ఈ ప్రయోజనములలో కొన్నిటిని మాత్రమే నిర్వహించు కావ్యములు పెక్కున్నవి. అన్నింటినీ నిర్వహించునవి మూడే అని రామాయణ, భారత భాగవతములు. వానిని రచించిన వారు భగవత్సదృశు లైన మహామునులగుటయే దానికి కారణము.

అచతుర్వదనో బ్రహ్మ
ద్విబాహురపరో హరిః
అఫాలలోచన శ్శంభుః
భగవాన్ బాదరాయణః

''నమస్తస్మై''

